III

ఇది

శ్రీ శ్రీ యార్లగడ్డ రామకృష్ణ ప్రసాద్ బహాదూర్

వారికి వారి వివాహమహోత్సవ సమయంలో

శుభాశంసాపూర్వకముగా ఇచ్చిన

కానుక.

ఈ యథార్థదృశ్యాలు, ఉన్నతాదర్శం చూపడానికిగాని, నాటక నిర్మాణచాతురి ప్రదర్శించడానికిగాని వ్రాయలేదు. ఉన్నది ఉన్నట్లు చూపడమే నా ప్రధానోద్దేశము.

ఉన్నది ఉన్నట్లుచూపడం అంటే కళాదృష్టి లేకుండా అని కాదు. ఈవిధమైన రచనల్లోకూడా చమత్కారం ఉందని నా నమ్మకం.

ఈ దృశ్యాలలో, రెండవదీ, నాల్గవదీతప్ప మిగిలినవన్నీ ఆల్ ఇండియా రేడియోవారిచే బ్రాడ్‌కాస్టు చేయబడినవి. వీటిని ప్రచురించడానికి అనుమతి ఇచ్చినందులకు వారికి నేను ఎంతో కృతజ్ఞుణ్ణి.

ఇందులో మూడవ దృశ్యము చదివినప్పుడు జాన్ వుడ్ వ్రాసిన గ్లింప్సెస్ ఆఫ్ రియాలిటీ (Glimpses of Reality.) అనే రచన జ్ఞాపకం రావచ్చును. కాని దానికీ దీనికీ సాదృశ్యము బహుకొద్ది. మిగిలినవన్నీ స్వయం కల్పితాలు.

ఈ దృశ్యాలు చదివినమీదట ఆనందం కలిగితే ఆవిషయం నాకు వ్రాయండి నేను సంతోషిస్తాను. నాకు ఇల్లాంటి రచనలు చేయడానికి ప్రోత్సాహకరంగా కూడా ఉంటుంది.

మునిమాణిక్యం

# యథార్థదృశ్యాలు.

## 1

(రైల్వే ప్లాట్‌ఫారమ్ - కుమారుని రైలులో ఎక్కించి తండ్రి క్రిందనుంచుని మాట్లాడుతూ ఉంటాడు - పండ్లు అమ్మేవాళ్ల కేకలతోనూ, ఇతర ప్రయాణీకుల మాటలతోను మనకు సంబంధం లేదు)

తండ్రి: నాయినా జాగ్రత్తగా కూర్చో. మరీ కిటికీదగ్గర వద్దు. తలుపుమీదికి వంగకుసుమా!

అబ్బాయి: (నవ్వుతాడు)

తండ్రి: నవ్వటంకాదురా! ఎన్నిసార్లు ఎంతమందికి అపాయంకలిగిందో నీకేం తెలుసు! దానితరువాత ఏమనుకుంటే ఏమిలాభం? జాగ్రత్త నాయినా, ఎందుకు చెప్పానోవిను.

అబ్బాయి: అల్లాగే నాన్నా, నీవు ఊరికే గాభరా పడకూ.

(నారింజపండు, నారింజపండు అంటూ ఒకడు కేకలు.)

తండ్రి: నాన్నా ఒకడజను నారింజపండ్లు కొని ఇస్తాను.

అబ్బాయి: ఎందుకు నాన్నా?

తండ్రి: ఎందుకేమిట్రా? అక్కయ్యకు ఇద్దువుగాని.

అబ్బాయి: అక్కడలేవు నాన్నా?

తండ్రి: లేకేం! ప్రతిఊళ్లో ఉంటయ్. కానీ నాన్నా ఇవి చూశావ్! రుచిఎక్కువ. తీసికెళ్లు.

అబ్బాయి: వద్దు నాన్నా.

తండ్రి: వద్దేమిట్రా. ఇంద. ఆ జామపండ్ల బుట్టలోనే పెట్టు. ఇవి పైన పెట్టుకు జామపండ్లు చితికిపోతై. ఏదీ? ఆబుట్ట ఇల్లాఇయ్యి. నేను సర్దిపెడతాను.... ఊఁ ఇంద. ఒరే, ఆ పైన పెట్టుకు. దిగేటప్పుడు మరిచిపోయి దిగేస్తావు! ఆ దోసకాయల బుట్టపక్కనే పెట్టు.

అబ్బాయి: ఊఁ...సరే.

తండ్రి: మీఅమ్మా, బామ్మకూడా వస్తానన్నారు స్టేషనుకు. ఇంకారాలేదే? టైముకూడా కావస్తున్నది.

అబ్బాయి: ఇప్పుడు రాకపోతే ఏం? అసలు ఎందుకు రమ్మన్నావు నాన్నా వాళ్లని?

తండ్రి: నేను అనలేదురా. వాళ్లే వస్తామన్నారు. మీరు వెళ్లుతూఉండండి, మేము వెనకాలెవస్తాము అనటం నీవు వినలేదురా? పోనీ రానీ. మనఇల్లు స్టేషనుకు దగ్గరగాఉంది కాబట్టి వస్తారు. పోనీలే. సరేగాని దోసకాయలబుట్ట ఎక్కడ పెట్టావురా? (గాబరాగా)

అబ్బాయి: ఎందుకు నాన్నా అంతగాబరా పడతావ్రా?
ఇదుగో.

తండ్రి: అహా. ఏం లేదులే. జాగ్రత్త. ఇంకా కాసిని దోసకాయలు ఇవ్వాలిసింది సుమీ!

అబ్బాయి: చాల్లేనాన్నా. ఇవన్నీ మోసుకొని వెళ్ళే టప్పటికి అవుతుంది!

తండ్రి: నీవేం మోస్తావ్రా అయినా! ఇక్కడ ఎక్కటం అక్కడ దిగటమే నాయను!

అబ్బాయి: ఆఁ ఏమిటినాన్నా స్వేచ్ఛగా తిరగకుండా?

తండ్రి: రైల్లో ఏం తిరుగుతావురా? కూర్చోటమేగా. ఇవన్నీ పక్కనడుంచు. విన్నేం జేస్తయ్?

అబ్బాయి: సరే నీవు వెళ్లు ఇహఁ.

తండ్రి: వెళ్తాలే. రైలు కదలనీ. అయితే నాన్నా యాకాయకీని ఒంగోలు వెళ్లు.

అబ్బాయి: ఏమిటినాన్నా అల్లా అంటావు. టికెట్టు ఒంగోలుకేగా కొన్నది నీవు? అయినా ఇవన్నీ నా న కైన పెకితివి, దిగాలనుకొన్నా దిగేందుకు వీలు లేకుండా.

తండ్రి: సరేలే. ఊరికే చెబుతున్నా. అక్కయ్యదగ్గర నాలుగు రోజులుండు.

అబ్బాయి: సరే నాన్నా ఉంటాను.

తండ్రి: మళ్ళీ యడ్లాయకీనీ ఇంటికి వచ్చేస్తావా?

అబ్బాయి: అల్లాగే.

తండ్రి: అదేమిట్రా తెనాలిలో దిగి చిన్న అత్తయ్యను చూచిరావా?

అబ్బాయి: చూచి రమ్మంటావా?

తండ్రి: చెప్పాలరా నీకు? ఈమాత్రం తెలియకపోయె!

అబ్బాయి: సరే దిగుతాను.

తండ్రి: దిగి, ఒకపూట అక్కడుండి మర్నాడు బయలుదేరి రా. అరెరె!

అబ్బాయి: ఏమిటి నాన్నా?

తండ్రి: ఆఁహా ఏం లేదులే...ఈమాట ఇందాక అనుకొన్నట్లయితే కాసిన వడియాలు ఇచ్చేది మీఅమ్మ ఆ త్తయ్యకిమ్మని.

అబ్బాయి: మంచిదే అయింది. ఇప్పటికే గాడిదబరువు అయింది.

తండ్రి: అల్లా అనుకోకూడదు. ఆపేక్షలు ఉండాలె. సరే...కిటికీలోనుంచి చూస్తూకూర్చోకు. ఒకప్పుడు ఆతలుపులు జారిపడతై. కొంచెం అవతలగాకూర్చో.

అబ్బాయి: ఇఁహ నీవు వెళ్ళునాన్నా.

తండ్రి: మీ అమ్మావాళ్ళూ వస్తారేమోనని చూస్తున్నా.

అబ్బాయి: నీవు వెళ్లి చెప్పు రైలు ఎక్కించానని. వాళ్లను రావద్దను.

తండ్రి: అదుగో మీఅమ్మా బాఅమ్మా వస్తున్నారు!

అబ్బాయి: తమ్ముడూ పాపాకూడా వస్తున్నారెందుకూ?

తండ్రి: ఏదో సరదాగా వస్తున్నారు.

(అంతా వస్తారు. రాధాయ, పాపను ఎత్తుకుంటూ ముందుగా వస్తారు)

రాధాయ: ఒరేయ్, ఈబ్యాటుతీసికెళ్లి బావకు ఇయ్యరా.

అబ్బాయి: ఏ బావకురా?

రాధాయ: చిన్న అత్తయ్యగారి బావకు.

అబ్బాయి: అంతా పాడైపోయి డొక్కు అయింది. ఎందుకురా ఇది వాడికి?

రాధాయ: వాడి ఆటకు అది చాల్లేద్దూ.

అబ్బాయి: నీవు మహా ఆడావు.

రాధాయ: నా ఆట సంగతి నీకెందుకురా?

అబ్బాయి: ఏడిశావులే...నోరుమూయ్.

రాధాయ: నీవు నోరుమూయ్. చూడు నాన్నా!

తండ్రి: (కోపంగా) చూస్తూనేఉన్నా మీగోల. మీ ఇద్దరూ గాడిదలలాగ అల్లరి చేస్తున్నారు.

తల్లి: ఏమిటండి మీరుకూడా వాళ్లతో చేరి! వాడేదో చెపుతుంటే వినసీయరాయె. నాయినా జాగ్రత్త రోయ్. వస్తువులన్నీ జాగ్రత్తగా దింపుకో నాయినా. చూడూ, ఇది అక్కయ్యకు ఇయ్యి.

అబ్బాయి: ఇంకోటా! ఏమిటిది?

తల్లి: ఆ ఏముంది అప్పడాలు కాసిని తెచ్చా, ఇందాక ఇయ్యటం మరిచిపోయి. పాపం దానికి అప్పడం అంటే తగని ఇష్టం.

అబ్బాయి: నీవు ఎక్కడికమ్మా? ఎందుకు బండిలోకి ఎక్కుతున్నావూ? వస్తావా?

ముసలమ్మ: రావటంకాదురా. వత్తులబుట్ట. మీ అమ్మమ్మకు. పాపం ఆవిడకు కళ్లు సరిగ్గా కనపడవు చేసుకోలేదు. అందుకని పంపుతున్నానుగాని, ఒరేబాబు, నీవు ముట్టుకోకేం.

అబ్బాయి: తాకకుండా ఎల్లాగమ్మా తీసికెళ్లటం?

ముసలమ్మ: ఏంరా నాయినా, ఇక్కడ రైల్లో నేను పెడతాను. అక్కడ అమ్మమ్మను తీసుకోమను!

అబ్బాయి: అమ్మమ్మ వచ్చిందాకా రైలు కూర్చుంటుందిటే!

ముసలమ్మ: మరి ఇబ్బంది వస్తే ఏం జేస్తాము.

అబ్బాయి: సరే అక్కడపెట్టు, నేను ఎల్లాగో చేరుస్తాను. నీవు దిగు.

(గంట కొడతారు)

తండ్రి: గంట కొట్టారోయ్ (గాబరగా) నాన్నా చెప్పులు ఎక్కడున్నయ్?

అబ్బాయి: నాకాళ్లకే ఉన్నాయి నాన్నా.

తండ్రి: జాగ్రత్త. ఎక్కడన్నా పారేసి వచ్చేవు! గొడుగూ? గొడుగు ఏదీ?

అబ్బాయి: బల్లక్రింద ఉందినాన్నా. వట్టి హడావుడి నాన్నా నీది. అన్నీ ఉన్నయ్. నీవు ఇహా వెళ్లు.

తండ్రి: నీకేం తెలుసు రైలుప్రయాణాల్లో ఎంత జాగ్రత్తగాఉండాలో. అన్నీ ఒక్కసారి లెక్కజూచుకో. గొడుగూ, జామకాయలూ, దోసకాయలూ, గుమ్మడికాయా, ట్రంకు, బ్యాటూ, వత్తులబుట్టా. అన్నీ ఉన్నట్టేగా? అన్నీ ఆరువస్తువులు. జ్ఞాపకం ఉంచుకో. అన్నట్టు నారింజకాయలు ఏవీ?

అబ్బాయి: జామకాయల అడుగున ఉన్నాయినాన్నా.

తల్లి: జాగ్రత్తగా వెళ్లిరా నాయినా.

అబ్బాయి: అమ్మా మీరిక వెళ్లండి.

యథార్థ దృశ్యాలు

(మళ్ళా గంట — గార్డు ఈల వేస్తాడు)

తండ్రి: టైము అయిపోయింది. నాయినా జాగ్రత్త రోయ్. తలుపుపైకి వంగకేం. కిటికీలోనుంచి చూడకు.

తల్లి: జాగ్రత్త నాన్నా.

తండ్రి: అన్నీ ఉన్నాయా నాన్నా?

అబ్బాయి: ఆ అన్నీ ఉన్నయి.

తండ్రి: యకాయకీని ఒంగోలు వెళ్ళునాన్నా.

అబ్బాయి: (నవ్వుతాడు)

తండ్రి: వచ్చేటప్పుడు చిన్న అత్తయ్యను తప్పకుండా చూచిరా.

(గార్డు ఇంకోసారి ఈలవేస్తాడు - రైలు కదులుతుంది బుస్ బుస్ మంటూ)

తండ్రి: నాయినా జాగ్రత్త. తలుపుపైకి వంగబోకు.

తల్లి: నాయినా జాగ్రత్త.

ముసలమ్మ: వస్తువులు జాగ్రత్త.

రాధ: బ్యాటు - బ్యాటు బావకియ్యరోయ్.

తండ్రి: గొడుగు పారేసేవ్ నాయినా.

(రైలు నడుస్తూవుంటే కేకలు)

రాధ: అత్తయ్యను అడిగానని చెప్పు.

పాప: బావను అడిగానని చెప్పు.

రాధ: బ్యాటురోయ్. బ్యాటు జాగ్రత్త.

తల్లి: పండగకు అక్కయ్యను పంపమని బావతో చెప్పు.

పాప: గవ్వలు. గవ్వలు మర్చిపోకు.

తండ్రి: జాగ్రత్తరా నాయనా. తలుపుకు దూరంగా కూర్చో.

తల్లి: నీవు ఒంగోలు చేరడంతోటే ఉత్తరం వ్రాయి. ఉత్తరంరా.

తండ్రి: తెనాల్లో దిగు మర్చిపోబోకు.

(రైలు వేగం హెచ్చుతుంది. ఇంకోసారి కూసి వెళ్ళిపోతుంది)

రాధ: బ్యాటు ఎక్కడైనా పారేస్తాడేమో!

తల్లి: ఏమో వెర్రివెధవ. ఒంగోలులో ఒక్కక్షణం ఆగుతుంది బండి. అన్ని వస్తువులూ దింపుకుంటాడో లేదో. ఆ గుమ్మడికాయ వదిలేస్తాడేమోనని నా అనుమానం.

తండ్రి: చిన్న వెధవలను రైలులో ప్రయాణం చేయనీయకూడదు. తలుపుమీదినుంచి వంగిచూడటం చాలా ప్రమాదం.

తల్లి: నేవెడతాను నేవెడతాను అని ఒకటే సరదా. ఇంకాసిని వడియాలిద్దామనుకొన్నాను అమ్మాయికి.

యథార్థ దృశ్యాలు

తండ్రి: ఇవ్వకపోయినావా?

తల్లి: ఏదీ ఒకటే తొందర. ఒకటే తొందర అయిపోయింది. పోనీలెండి. ఇంకోసారి ఎప్పుడైనా పంపొచ్చు. మరిచిపోయినా వంగోలులో తమలపాకులుచౌక. నాలుగు వందలు కొనుక్కురమ్మని చెప్పకపోయినారా అబ్బాయితో!

తండ్రి: (గాభరాగా) అరేరేరే...రే...

(రైలు వెళ్ళిపోయిన దిక్కుకు నాలుగడుగులువేసి నిస్పృహతో ఆగిపోతాడు.)

తల్లి: డబ్బు ఇవ్వటం మర్చిపోయినారా? పోనీలెండి ఉత్తరం వ్రాద్దాము వాళ్ల బావనడిగి తీసుకొని కొనుక్కురమ్మని.

తండ్రి: య్యహా! అదిగాదు ఉండు, అసలు టిక్కెట్టు ఇవ్వటమే మరిచిపోయినాను. ఇప్పుడెట్లాగు?

తల్లి: టిక్కెట్టు ఇవ్వటమే మరిచిపోయినారా! అయ్యో! మొట్టమొదటినుంచీ అనుకొంటునేఉన్నా మీరేదో ఇట్లాంటి పనిచేస్తారని. ఇప్పుడెట్లా? డబుల్ చార్జి కడతారుకామాలు. డబ్బు ఉందిగా వాడిదగ్గర?

తండ్రి: ఏదీ ... టిక్కెట్టు చేతికిస్తే పారేసుకొంటాడని డబ్బూ, టిక్కెట్టుకూడా పర్సులో పెట్టి, ఈపర్సు...

...పర్సు ఇద్దామనుకొన్నాను. ఏదీ, నన్ను మాట్లాడనిస్తేనా? మీరంతావచ్చి ఒకటేగోల ఆయె.

తల్లి: టిక్కెట్లు ముందుగా ఇచ్చుకోరుటండీ?

తండ్రి: ఇచ్చుకొంటారులే! నీకన్నీ మహా తెలుసు! ఇహ ఇంటికి నడు. చేసిన నిర్వాకంచాల్లే—!!

(అని విసుక్కొని పెద్దపెద్ద అంగలువేసుకొంటూ స్టేషను మాష్టరు గదిలోకి వెడతాడు. మిగిలినవాళ్లంతా ఇంటివైపుకు నడతారు. తల్లిమాత్రం, "నన్నుకోప్పడతారు. ఇదేమిటి? నేనేం జేశాను?" అనుకొంటూ నడుస్తుంది.)

(ఆల్ ఇండియా రేడియో వారి అనుమతిని.)



# 2

(రంగము: పంతులుఇల్లు. మేడపైన గది. బల్లలూ, కుర్చీలూ ఉంటవి. పుస్తకాలూ, చొక్కాలు, పరికిణీలూ అన్నీ చిందరవందరగా పడేసిఉంటై. జయా, రామూ చదువుకొనే గది అది. ఆ గది చూస్తే ఆ యిద్దరూకలసి అక్కడ నానా అల్లరీ చేస్తున్నారని తెలుస్తూనే ఉంటుంది. ఆ గదిలో రెండు ఓగ్ జన్ క్లైనుపీసులు ఉంటై.)

రాముః: (వేళ్ళపైన లెక్కపెడుతూ చదువుతూ ఉంటాడు) సిక్కులు ఓడిపోయిన యుద్ధములు, మూడ్కీ, ఫిరోజ్ బాద్, మూడ్కీ, ఫిరోజ్ బాద్, ఆలీవాల్, సోబ్రాన్ .సోబ్రాన్ (వెనకనుంచి జయవచ్చి కళ్లు మూస్తుంది)... ఎవరూ?

జయ: ఎవరో చెప్పుకోవాలె.

రాము: ఎవరబ్బా!......రాధాయ.

జయ: ఊఁహూ.

రాము: సూరి.

జయ: కాదు.

రాము: (ఒక్కగుక్కలో అనేస్తాడు.) సుందరి, శ్యామల, వనజాక్షి, అరవింద, సుబ్బలక్ష్మి, కోకిలమ్మ, చూడమ్మ, పంకజమ్మ (అలసిపోయినట్లు నటిస్తాడు)

జయ: కాదు. (కిలకిలానవ్వుతూ) ఎవ్వరూ కాదు.

రాము: కళ్లుమూస్తే ఎవరు అయిందీ ఎల్లాగ తెలుస్తుం దమ్మా! వదులు. ఎవరైందీచూసి చెపుతా.

జయ: అమ్మా! చూచిచెపుతావేం? చూడకుండానే చెప్పాలె.

రాము: అయితే చెపుతానుండు. ఎవరంటే...ఝాన్సి లక్ష్మిబాయి, చాంద్‌బీబీ, నూర్జహాన్, పద్మిని, ముంతాజ్, అనార్కలీ.....

జయ: (నవ్వి) ఛా. చెప్పలేవ్ ......జ......

(అని తన పేరు అందిస్తుంది.)

రాము: (అప్పటికీ తెలియనట్లు) జ...జ...ఎవరబ్బా! జక్కమ్మ...

జయ: ఏమిటమ్మా చెప్పలేవ్వూ?

రాము: (జ్ఞాపకంవచ్చినట్లు నటిస్తూ) ఆ...జయలక్ష్మి.

జయ: (విరగబడి నవ్వుతుంది.)

రాము: (నవ్వుతాడు)

(ఈ నవ్వటం ఒకరకం ఆటలోకి దిగుతుంది. ఇద్దరూ కాసేపు నవ్వుతారు. ఆగుతారు. మళ్లీ ఇద్దరూ విరగబడి నవ్వుతారు. ...అదేపరుస)

రాము: (హఠాత్తుగా నవ్వు ఆపి కోపంగా) ఏమిటే జయా! మరీ అల్లరి పిల్లవు అయిపోతున్నావు! నన్ను చదువుకోనియ్యవా?

జయ: మహా చదివావులెద్దూ. అందుకనే క్రిందటి సంవత్సరం తప్పావు.

రాము: నే తప్పానా ఏమిటి? ఆ మాస్టరు నన్ను తప్పించాడు. అయినా నీ కెందుకే ఆ విషయాలన్నీ?... పోనీ...తప్పితే తప్పాను. నీకెందుకూ? నీవు వెళ్ళరాదూ నీగదిలోకి?

జయ: నాన్న, నన్ను ఈ గదిలో ఉండి నీవు సరిగ్గా చదువుతున్నదీ, లేనిదీ చూస్తూ ఉండమన్నాడు. నాన్నకు కోపంవస్తుందని కాని లేకపోతే అసలు నేను ఇక్కడ ఉండేదాన్నే కాదు. (నవ్వుకొంటుంది)

రాము: (కోపంతో) నీవు ఉండబట్టి సరిపోయింది. లేకపోతే, నేను ఎందుకూ పనికిరాకుండా పోయేవాడినే కామాలు!

జయ: ఆ తప్పకుండా!

రాము: అయితేమానెలే! నీవువెళ్ళు, నేను చదువుకొంటాను. (అని, పుస్తకంలో పేజీలు తిరగేస్తూ, ఒక

పేజీలో వ్రాసివున్న, ఒకమాటనుచూచి ఉలిక్కి-
పడి) జయా! ఎవరే ఇది వ్రాసింది?

జయ: ఆ పుస్తకం వ్రాసిందా? గ్రంథకర్త.
రాము: కాదు. ఇక్కడ 'కోతి' అని వ్రాసిందెవరు?
జయ: ఏమో, నాకేమి తెలుస్తుంది?
రాము: నువ్వుకాదూ? కనపడటం లేదూ ఈ వ్రాత?
జయ: అవును. నేనే. ఏం వ్రాస్తే?
రాము: ఎందుకు వ్రాయాలి?
జయ: నీవు కోతివికాబట్టి 'కోతి' అని వ్రాశాను.
రాము: (బుడ్డమూతిపెట్టి) నేను కోతినా ఏమిటి?
జయ: (బావ బుజంపైన చెయ్యివేసి, ముఖంలోముఖం పెట్టిచూస్తూ) కోతిఅంటే కోపంవచ్చిందా బావకు. పోనీలే. అననులే.

"కోతి కోతి అంటే - కోపంబువచ్చె
ముచ్చులాగ మొగము - ముడుచుకొనిపోయె
రచ్చకూ, బావకూ - రాసిగ్గులాయె
చదువుల్లోబావకూ- మొగము చెల్లకపోయె"

(అని ఎగురుతూఉంటే తలుపుతట్టిన శబ్దం అవుతుంది. ఎవరి బల్లదగ్గరకు వాళ్లుచేరి పుస్తకాలు తెరుస్తారు. పెద్దగా చదవటం

ఆరంభిస్తారు. మధ్య మధ్య బిక్క ముఖాలతో ద్వారంవేపుచూస్తూ నవ్వుకొంటూ)

రాము: (పెద్దగా) సిపాయీలు ఉపయోగించు తూటా లపై కొవ్వు పూయబడి యుండెను. (దిక్కులు చూస్తూ) సిపాయీలు ఉపయోగించు తూటాలపై (నవ్వి) సిపాయీలు ఉపయోగించు తూటాలపై కొవ్వు పూయబడియుండెను.

(చదువుతున్నాని జయవంక చూచి నవ్వుతాడు)

జయ: (నవ్వుతూ) ఇండియాకు ఉత్తరదిక్కున హిమా లయ పర్వతపంక్తులు గలవు. ఉత్తరదిక్కున హిమా లయ పర్వతపంక్తులు గలవు. దక్షిణమున...(అటూ ఇటూ చూచి) ఒరే బావా...ఎవ్వరూ రావటం లేదురా.

రాము: (వినిపించుకోక) తూటాలపై కొవ్వు పూయ బడియుండెను. అది ఆవు కొవ్వు అని హిందువులు అనుకొనిరి.

జయ: (కిటికీలోనుంచిచూచి) నాన్న రావటంలేదురా.

రాము: అయినా నేను చదువుకోవాలె. నన్ను మాట్లా డించకు.

జయ: (పౌరుషంగా) నేనూ చదువుకోవాలె.

(ఇద్దరూ ఒక్కేసారి చదువుతారు. రామూ చదవటం ఆపితే జయ ఆపుతుంది. రామూ మెల్లగా చదివితే జయకూడా మెల్లగా చదువుతుంది. రామూ పెద్దగా చదివితే తానూ పెద్దగా చదువుతుంది. మధ్య మధ్య నవ్వుకుంటూ ఇల్లాగ అల్లరిగా చదువుతూ ఉంటారు)

జయ: (నవ్వి) ఏమిటా, అల్లరి?

రాము: నీవే అల్లరిచేస్తున్నావు. నీవు కాదుటే ఇందాకటి నుంచి గోలచేసింది. కోతి అని వ్రాశావు!

జయ: నేను వ్రాయలేదు.

రాము: నీవు వ్రాయలేదూ? ఎవరే వ్రాసింది ఇది? బుగ్గ సాగదీస్తేసరి! (అని బుగ్గలు ముట్టుకోబోతే జయ తోసివేస్తుంది)

జయ: సాగదీస్తావు! సాగదీస్తే ఎరగవ్రా? నాన్నతో చెప్పి బాగా...(కొట్టిస్తానని అభినయము)

రాము: చూద్దాంగా! మామయ్య రానీ.

జయ: చెపుతావా?

రాము: ఆ తప్పకుండా చెబుతా.

(జయ దొంగలాగవచ్చి "కోతి" అని తను ఏపుస్తకంలో వ్రాసిందో ఆపుస్తకాన్ని లాక్కుంటుంది. రామూ తిరిగి ఆపుస్త

కాన్ని లాక్కోవాలని ప్రయత్నం. ఇద్దరూ పోట్లాట. ఇంతలో ఎవరో వస్తున్నట్లు అలికిడి జయ పుస్తకాన్ని వదలివేస్తుంది. ఎవరి కుర్చీదగ్గరకు వాళ్లు వెళ్ళికూర్చుంటారు. పంతులు "అమ్మాయీ!" అని పిలిచి తలుపు కొడతాడు. జయ గాబరా పడుతుంది. తాను చదువుకొంటూ ఉన్నట్లు తండ్రికి అభిప్రాయం కలుగజేయ్యాలనే ఆదుర్దాలో పెనసలు, కలం, సిరాబుడ్డి, చేతికి అందిన పుస్తకం, అన్నీ పట్టుకొని తలుపు తీస్తుంది. పంతులు లోపలికి వచ్చి, బిడ్డనుచూచి నవ్వుకొంటాడు)

పంతులు: (తన చేతి గడియారంవంకచూచి) అమ్మా ఇంకా చదువుతూనే ఉన్నావా? బావా నీవూకలిసి చదువుకొంటున్నారా ? (బిడ్డను దగ్గరకు తీసికొని ముద్దుపెట్టుకొంటూ) ఏమి చదువుతున్నావు తల్లీ!

జయ: జాగ్రఫీ నాన్నా !

పంతులు: మాతల్లి జాగ్రఫీ చదువుతున్నదా! (మళ్లీ ముద్దెట్టుకొని) అంత పెద్ద జాగ్రఫీపుస్తకం ఏమిటమ్మా, నీ చేతులో? అంత పుస్తకం చదవగలవా? ఏదీ ఇల్లా ఇయ్యి...

జయ: (తెల్లపోయి చేతిలోని పుస్తకం తండ్రికి ఇస్తుంది)

పంతులు: రైల్వే గైడ్ ఇది!. రైల్వేగైడ్ చూస్తున్నావా తల్లీ? జాగ్రఫీలో వచ్చిన పట్టణాలూ, అవీ, ఇండియాలో ఎక్కడెక్కడ ఉన్నయ్యో, ఏ రైల్వే లైనుమీద ఉన్నయ్యో చూస్తున్నావా అమ్మా!

జయ: (తెప్పరిల్లి తెలివిగా) అవునునాన్నా, అదే చూస్తున్నాను.

పంతులు: మాతల్లి తెలివిగలది. చాలా మంచిపని అది. అల్లా చేయటంవల్ల జాగ్రఫీ వస్తుంది. జనరల్ నాలెడ్జి వృద్ధి అవుతుంది.

(రామూవైపు తిరిగి) నీవేమి చదువుతున్నావురా?

రాము: (కణతలు నొక్కిపట్టుకొని) హిస్టరీ మామయ్యా!

పంతులు: తలనొప్పిగా ఉందా?

రాము: కొంచెంగా.

పంతులు: అదేపనిగా చదివితే. తలనొప్పిరాదూ! అంత అతిగా చదవటమూ పనికిరాదు.

(అని దగ్గరకువెళ్లి రామూ చదువుతున్న పుస్తకంవంక చూస్తాడు. రామూ ఆగాబరాలో పుస్తకాన్ని తలక్రిందుగా పట్టుకొన్నాడు. తాను పుస్తకాన్ని తలకిందుగా పట్టుకొన్నట్లు రామూ తెలిసికోలేదు)

రామూ ఏమి చదువుతున్నా నన్నాయ్రా?

రాము: హిస్టరీ మామయ్యా!

పంతులు: పొద్దుటినుంచీ చదువుతున్నావా ఏంరా?

రాము: (ముఖం వికారంగా పెట్టి కణతలు మళ్ళీనొక్కుకొంటూ) చదువుతున్నాను మామయ్యా. ఏదో పరీక్షలు దగ్గరకు వచ్చాయికదా అని...

పంతులు: మంచిదేకాని...పొద్దుటినుండీ ఆపుస్తకాన్ని అల్లాగ తలకిందుగా పెట్టే చదువుతున్నావా?

రాము: (తెల్లపోతాడు భయంతో)

పంతులు: హిస్టరీ అయితేమటుకు పుస్తకం తలకిందుగా పెడితే ఏమి తెలుస్తుందిరా నాయనా.

రాము: (మాట్లాడడు)

పంతులు: సరేలే. చదువు ఆపి అన్నానికి రా. (అని వెళ్ళిపోతాడు నవ్వుకుంటూ)

జయ: (తండ్రి వెళ్ళగానే ఒక్క గంతువేసి) ఒరేబావ! పుస్తకం తలకిందుగా పెట్టి చదవగల్గువురా... మా బావకు పుస్తకం తలక్రిందుగా వచ్చు! (అని వెక్కిరిస్తుంది. ఇంతలో రెండు గడియారాలు ఒకేసారి అలారం కొడతై) బావా భోజనానికి వెడదాం రా.

యథార్థదృశ్యాలు

రాము: (విసుగుగా) ఈమోత ఏమిటే జయా చదువు కోనీయకుండా?

జయ: (నవ్వి) చదువులోపడి నీవు తిండిసంగతి బొత్తిగా మరచిపోతావేమోనని సరిగ్గా పదింటికి అలారం పెట్టాను. చూశావా బావా? నీ చదువుకు ఎంత సాయం చేస్తున్నానో! పాపం చాలా కష్టపడి చదివావు ప్రొద్దుటినుంచీ పుస్తకం తలక్రిందుగా పెట్టి! (తండ్రి అన్నట్లుగా) ఆదేపనిగా చదవటమూ మంచిదికాదు ! లే. అన్నానికి వెడదాము రా. (అంటూ చెయ్యిపట్టుకొని లాగుతుంది)

రాము: అబ్బ చదువుకోవాలె, ఉండవే జయా.

జయ: (పెద్దగానవ్వి) మహా చదివేవాడిలాగ! రా! (అని మళ్ళీ లాగుతుంది)

రాము: (చదువుకు భంగంకలిగినందులకు విచారిస్తున్నట్లు నటిస్తూ) సాయంత్రం అన్నా బాగా చదవాలె మధ్యాహ్నంమటుకు ఒకగంట నిద్రపోయి...

(జయా, రామూను నెట్టుకొంటూ ఎగురుకుంటూ తీసుకెడుతుంది)



# 3

(పంతులుఇల్లు. హాలు. బట్టలవర్తకుడు కోటయ్య, మూట దింపుకొని రకరకాల చీరలు ఆఇంటావిడకు చూపుతూ ఉంటాడు. చీరల బేరంలో పంతులుకూడా భార్యకు సాహాయ్యం చెయ్యటానికి అక్కడే కూర్చుంటాడు)

కాంతం: ఏం, కోటయ్యా ఈరంగు ఉంటుందా? ఒక్క ఉతుకుతో పోతుందా?

కోటయ్య: రంగు గ్యారంటీ అమ్మా! రంగుపోయి కూరాకు అయిపోయేగుడ్డ మీకు ఇవ్వాళ ఇయ్యం గానే సరా అమ్మా! రేపు మళ్ళీ గుమ్మం తొక్కాలా?

కాంతం: (పంతులుతో) - అయితే చూడండి ఈ రెండిట్లో ఏది బాగుందో చెప్పండి?

పంతులు: రెండూ బాగానే ఉన్నాయి.

కాంతం: రెండూ బాగుండటం కాదండీ. మీకు ఏది నచ్చిందో చెప్పండి?

పంతులు: ఇది చాలా బాగుంది. ఏమంటావయ్యా కోటయ్యా?

కోటయ్య: దానికేమండీ! అది రాజాచీర!

కాంతం: ఏదీ రాజాచీర?

పంతులు: ఆ ఎర్రచీర.

కాంతం: (పెద్దగానవ్వి) ఈ ఎర్రచీర కోసమనా మీరు అనటం?

పంతులు: అవును. ఏం? ఎందుకు అల్లాగ నవ్వుతావ్? ఆ ఎర్రచీర పండులాగ, నిక్షేపంలాగ ఉంది. నీవు కాపరానికివచ్చిన మొదటిరోజున అల్లాంటి చీర కట్టుకొనివచ్చావు. జ్ఞాపకం ఉందా? ఆచీర నాకు బాగుంది. కొను.

కాంతం: బాగుండటానికేమీ, ఆచీర బాగానే ఉంది. కాని దానిమీద ఆకుపచ్చరవిక ఎల్లాగ తొడుక్కోటం?

పంతులు: పోనీ ఇంకోటి తొడుక్కో.

కాంతం: అదెల్లాగండీ. ఈపండగకు తొడుక్కోమని మాతమ్ముడు ప్రత్యేకంగా కొని ఇచ్చాడాయెను ఆ రవిక! అది తొడుక్కోకుండా, ఇంకొకటి తొడుక్కుంటే వాడికి కష్టంగా ఉండదూ?

పంతులు: అయితే ఎర్రచీరపైన, ఆకుపచ్చరవిక తొడుక్కోరా?

కాంతం: మీరు బి.ఏ. ప్యాసు అయినారుగదా! ఈ మాత్రం తెలియదేమండీ! (వెక్కిరింతగా నవ్వుతూ) ఎర్రచీరపైన ఆకుపచ్చరవిక ఎవ్వరైనా తొడుక్కుంటారుటండీ?

పంతులు: (ఆమాత్రం తెలియనందులకువిచారపడుతూ) తొడుక్కోరా? ఏమయ్యా కోటయ్యా?

కోటయ్య: అంతేనండి. అమ్మగారు చెప్పిందే రైట్. ఎర్రచీరపైన ఆకుపచ్చరవిక సాధారణంగా ఎవ్వరూ తొడుక్కోరండీ.

పంతులు:

(కోటయ్యకూడా కాంతం మాటనే దృఢపరచేటప్పటికి తన తెలివితక్కువను తానేసిగ్గుపడి దీనుడై, ఇంకోమంచిచీర చూపించి ఈ అవమానాన్ని పోగొట్టుకొందామనే నిశ్చయంతో, ఆ ఉన్న చీరలవంక నిదానించిచూచి, ఒక నిశ్చయానికివచ్చి కొంచెం సంతోషంతో)

పోనీ ఈచీర తీసుకో అంచుచక్కగా ఉంది. మంచి అంచూ, జరీ అన్ని ఉన్నయి.

కాంతం: (పంతులునుచూచి, ఆయన తెలివితక్కువకు మరొకసారినవ్వి) ఈ ఆకుపచ్చచీరా? ఇదేనా మీర నటం? ఆకుపచ్చనిచీరా, ఆకుపచ్చని రెవికానా? అవ్వ! (అని అరచేత్తో నోరు మూసుకొంటుంది)

కోటయ్య: (పంతులునుచూచి నవ్వి) పంతులుగారికే ఏం తెలుస్తయ్యండి, ఈ విషయాలన్నీ? మీకు ఇష్టమైనచీర మీరు తీసుకోండి అమ్మా!

పంతులు: ఏచీర బాగుందీ నేను చెప్పలేనంటావ్, ఏమయ్యా, కోటయ్యా?

కోటయ్య: తమరు చెప్పలేకేమండి! తమరు చెప్పక పోతే ఇంకెవ్వరు చెబుతారు?

పంతులు: ఈ తభా నీకు నచ్చే చీర చూపుతాను చూసుకో. ఈ మబ్బురంగు చీర తీసుకో.

కాంతం: (సందేహంగా) మబ్బురంగు చీర బాగుందం టారా?

పంతులు: చాలా బాగుంటుంది. సిల్కులాగ మెరుస్తు న్నది. దీనిపైకి నేను కొని ఇచ్చిన నల్లపట్టు రెవిక తొడుక్కోవచ్చుకూడా!

## య థా ర్థ దృ శ్యా లు

(కోటయ్య అమ్మగారి వంక చూచి నవ్వుతాడు - కాంతంకూడా నవ్వుకొంటుంది. మళ్ళీ తెలివితక్కువలో పడ్డానా అని పంతులు తెల్లపోతాడు)

ఏం కోటయ్యా, నేను చెప్పినమాట బాగుండలేదూ?

కోటయ్య: బాగుండకేం అండీ - అంటే మబ్బురంగు చీరపైకి నల్లరవిక అంతబాగుండదు. అందుకని అమ్మగారు నవ్వుతున్నారు!

కాంతం: వారు చెప్పినమాట నిజమేనయ్యా, ఎంతో నాజూకుగా ఉంది ఈచీర.

పంతులు: (సంతోషంతో) ఇహ ఎందుకూ, ఈచీర తీసుకో నామాట విని.

కోటయ్య: తీసుకోండి, అమ్మా! శంకరంగారింట్లో రెండు చీరలు ఇచ్చాను ఇల్లాంటివి.

కాంతం: ఉండవయ్యా - తొందర పడతావేం? ఇంకో రెండు రకాలు చూడనియ్యి.

కోటయ్య: చూడండి అమ్మా! ఎవరొద్దు అన్నారు?

పంతులు: కాంతం! చూడూ నాకు ఎన్నాళ్లబట్టోఉంది, నీవు ఇల్లాంటిచీర కట్టుకొంటే చూద్దామని. ఇదికొన మంటావ్?

కాంతం: ఈనల్లచీర కొనిస్తారా? బాగానేఉంది! నల్ల దానికి నల్లచీరె! ఏం బాగుంటుం దండీ?

పంతులు: (కొంచెం కోపంగా) నీవు నల్లనిదానివని ఎవ రన్నారూ?

కాంతం: (నోరు అరచేత్తో గట్టిగా నొక్కుకొని) అవ్వ. ఊరుకోండి. ఇక్కడేనా మీసరసాలు, అవతల కోట య్యఉన్నాడు. పెద్దవాడు కాబట్టి సరిపోయింది. ఇంకెవ్వరైనా వింటే నవ్విపోతారు. ఇంతకూ, తేల్చండి, ఏచీర కొనమంటారో? పాపం చాలాసేపు కూర్చోబెట్టాము కోటయ్యను.

పంతులు: నేనేమి తేల్చేది? నీవు అన్నిటికి అన్నీ చెపు తుంటివి!...నేనేం మాట్లాడను?

కాంతం: అదేమిటండి. అల్లాగంటారూ? మీకు నచ్చని చీర నేను కొంటానా ఏమిటండీ?

కోటయ్య: సుందరమ్మగారు ఈ వంగపండు చాయ చీరెలు కొన్నారండీ, వారింట్లో అద్దెకున్నవారు ఇంకా రెండు కావాలన్నారు ఇల్లాంటివి!

కాంతం: (చప్పరించి) మా పంతులుగారికి ఆ రంగంటే ఇష్టంలేదు.

(అని పంతులుపంక చూచినవ్వుతుంది. పంతులు తనకు ఆరంగు ఇష్టంలేదుకావాలు అనుకొంటూను)

పంతులు: చూడూ, ఈ ఊదాచీర ఎట్లా ఉందంటావ్?
ధగ ధగ మెరిసిపోతున్నది, ఇది కొనరాదూ?

కాంతం: అది మొదట్లో అల్లాగే మిడిసి పడుతుంది. రెండు ఉతుకులైనతరువాత బూడిద రంగులోకి తేలుతుంది.

కోటయ్య: ఆమాట నిజమేనండీ. ఆచీర మీాకు ఇయ్య మన్నా ఇయ్యను.

పంతులు: మాలపిల్లచీరలూ, గృహలక్ష్మి చీరలూ అటు వంటివి ఏమైనా ఉన్నయ్యా కోటయ్యా?

కాంతం: అహాహ. అవన్నీ చూడక్కర్లేదయ్యా! ఎదో చిన్న పిల్లలకుకాని అల్లాంటివి; నా వయసువాళ్లు కట్టాలిసిన చీరలుకావు అవి.!

పంతులు: నేను చెప్పినవాటిలోకల్లా, ఒక్క మబ్బురంగు చీరే నీకు నచ్చినట్లుంది. నిజానికి ఆచీర బాగుంది కూడాను. ఇప్పుడు అందరూ అదే కడుతున్నారు.

కాంతం: అందుకనే సందేహిస్తున్నానండి. అందరూ అదే కడుతున్నారు. మరీ వేలం వెర్రిగా ఉంది. ఇంకో

రంగులో చూద్దామనీ...ఎట్లాగయినా చూశారూ, ఎరుపు ఎరుపేననుకోండి!

పంతులు: పోనీ ఎరుపే కొను. ఎవరొద్దన్నారూ? నేను మొట్టమొదటే చెప్పాను ఎరుపు నీకు ఎంతో బాగుంటుందని.

కాంతం: సరే కానీయండి. ఎరుపులో నాలుగురకాలు చూపవయ్యా కోటయ్యా?

పంతులు: ఎరుపులో, మరీ కన్ను చెదిరే, ఎరుపుగాక కొంచెం గులాబీరంగులో ఉండేవి చూపు.

కోటయ్య; చూడండి——

(అంటూ నాలుగు చీరలు మూటలోనుంచితీసి కాంతం ముందు పడేస్తాడు)

కాంతం: మీరుకూడా చూడండి. కాస్త చెప్పండి ఏది బాగుంటుందో...దిక్కులు చూస్తారెందుకూ?

పంతులు: (ఒక చీరచూపుతూ)- ఇది బాగుంది ఎర్ర గన్నేరురంగు.

కాంతం: బాగానేఉంది కానీండి, ఇంత ముదురురంగు బాగుండదండీ.

పంతులు: పోనీ ఇదీ? ఇది లేతరంగులో ఉంది.

కాంతం: ఏబ్బే! దానికి అంచు ఏదండీ?

పంతులు: అల్లాఅయితే దీనికి చక్కని అంచుందిచూడు.

కాంతం: అంచు బాగానే ఉందికానీ...

పంతులు: (విసుగ్గా) ఇంకా, కానీ, ఒకటుందీ?

కాంతం: (చిన్న పుచ్చుకొని) మీకు విసుగ్గాఉంది. పోనీ లెండి. మీ ఇష్టంవచ్చింది కొని యీయండి, నేను కాదంటే అప్పుడనండి.

పంతులు: విసుగు ఏముందిలే.! నీవు ఎంతసేపటికీ తేలని వ్వావామె! మబ్బురంగు కొనుక్కో, నామాట వినే టట్లు అయితే.

కాంతం: ఎంత ఆమబ్బురంగు చీర ?

కోటయ్య: పదిన్నరేనండి.

కాంతం: పదిన్నరా? అయితే ఆడబ్బు పెడితే ఆ గులాబి రంగుచీరే వస్తుందిగా ?

పంతులు: ఎందుకురాదూ?

కాంతం: పోనీ అదే కొంటే?

పంతులు: చూస్తున్నాగా నీ మనస్సుఅంతా ఎర్రచీర మీదే ఉంది. పోనీ అదే కొను. ఎందుకూ ఇంత ఆలోచన?

కాంతం: అదికాని ఈ పండక్కి కట్టుకొంటే ఆ ఆకు పచ్చ రెవిక తొడుక్కొంటానికి వీలుండదే అని చూస్తున్నానండీ. అంతకంటే మరేమీలేదు!

పంతులు: ఊఁమ... నాకు తలకాయ తిరిగిపోతున్నది. ఏచీరపైన ఏ రెవిక తొడుక్కోటానికి వీల్లేదో ఒక కాయితంమీద వ్రాసుకోవాలె. నెంబర్ ఒన్- ఎర్ర చీరపైకి ఆకుపచ్చ రెవిక తొడుక్కొంటానికి వీలు లేదు. నెంబర్ టూ - ఏమిటీ?

(అంతా నవ్వుతారు)

కాంతం: టూ లేదు ఏమీలేదు. ఊరుకోండి. ఏమిటీ ఆవేళాకోళం ? కాకపోయినా...

పంతులు: వేళంకోళం ఏమీకాదు. సంగతులు తెలుసుకుంటున్నాను. ఎర్రచీరసంగతి తెలిసింది. మబ్బు చీర కొంటానికి నీ అభ్యంతరం ఏమిటీ?

(కాయితం - పెనసలు పట్టుకొని కాంతంవంక చూస్తాడు. కాంతం నవ్వి అవి లాక్కొని బల్లమీద పెడుతుంది)

కాంతం: అభ్యంతరం ఏమీలేదు. ఆ రెండు చీరలు కొనాలని ఉంది. అది అసలుసంగతి.

పంతులు: రెండూ కొంటానికి నాదగ్గర డబ్బులేదు. కాబట్టి ఏదో ఒకటి కొనుక్కో..

కోటయ్య: ఈ పండగకు మబ్బురంగు చీరకొనండి. ఈ చీరలు ఇక రావుకూడా.

కాంతం: సరే కొంటానుగాని, సంకురాత్రికి ఎర్రచీర కొంటారా?

పంతులు: సరే. కానీ...ఆ కాయితం, పెనసలు ఇల్లా ఇచ్చి, ఇక చెప్పు, ఏయే పండగకు ఏరంగుచీర కొని, ఇయ్యాలో ఒకలిస్టు తయారుచేసుకొని ఉంచు కొంటాను.

కాంతం: (చిన్నపుచ్చుకొని) ఎందుకండీ అంత వేళా కోళం? నేనేమీ మాట్లాడను. మీకు నచ్చినచీర తీసి ఇయ్యండి. నేను తీసుకొని కట్టుకొంటాను.

పంతులు: (జయోత్సాహంతో) అయితే - ఇప్పటి ఆర్థిక పరిస్థితులలో ఒక్కచీరే కొని ఇయ్యగలను కాబట్టీ, అనుపచ్చ రెవికకు సంబంధించిన అభ్యంతరాన్ని కూడా మనస్సులో పెట్టుకొని పంతులుచేసే తీర్మానం ఏమిటీఅంటే? "నీవు ఆమబ్బుచీరే ఈదఫాకు కొనవల సిందీ" అని. (అంతా నవ్వుతారు)

కోటయ్య: అమ్మా! వారు అంతగా చెబుతున్నారు, పోనీ ఆ మబ్బురంగుచీరే తీసుకోండి.

కాంతం: సరే అదే ఇయ్యవయ్యా. కాని ఎరుపు ఎరుపే! ఆ గులాబిరంగు అందం దేనికీరాదు!

కోటయ్య: ఆమాట ఎల్లాగూ నిజమేనండి. గులాబి రంగుచీర అందం దేనికీరాదండి. పోనీ ఆచీరే కొనుక్కోనీయండి పంతులుగారూ !

పంతులు: నేను వద్దు అన్నానటయ్యా? ఆవిడకు ఆ రంగుమీదనే బాగాఉంది. నేను మొదటే చెప్పాను, ఆచీర కొనుక్కోమని. సరే. అది ఇచ్చేసి నీవువెళ్లు.

(కోటయ్య ఆచీరఇచ్చి, మిగిలిన చీరలన్నీ సద్దుకొని మూట కట్టుకోబోతుంటాడు)

కాంతం: ఏమిటయ్యా, నీవుకూడా అంత తొందర పడతావేమయ్యా?

పంతులు: తొందరగాక ఏమిటి? ఇప్పుడు పదిన్నర అయింది. అతడు వచ్చి గంట అయింది.

కాంతం: అయితే ఎల్లాగండీ కాస్త పనివచ్చినప్పుడూ? ఇంతకూ మీరనటం ఆ ఎర్రచీర కొనమనేనా?

పంతులు: నేను మొదటనే కొనమన్నాను అది. ఎరుపులో గులాబికొను మాట్లాడక. ఆ ఆకుపచ్చ రవిక ఇంకోసారి తొడుక్కుందువుగాని, ఇంకోరకం చీర కొన్నప్పుడు.

కాంతం: ఏదీ ఒక్కసారి చూడనియ్యండి.
పంతులు: ఇందాక నీవుచూసిందే, అంచు బాగుంది అన్నావు. నేత బాగుంది అన్నావు.
కోటయ్య: అవునండి అమ్మా! ఈచీర నచ్చిందే మీకు. తీసుకోండి.
కాంతం: అదే చూస్తున్నానయ్యా.
పంతులు: ఇంకా ఏమిచూస్తావు? ఆకలి అవుతున్నది. ఏదోఒకటి కొనుక్కో. తొందరగా అతనిని పంపించు.
కోటయ్య: పంతులుగారూ! మీరు తొందరపడతారెందుకండీ? అమ్మగారు ఏచీర నచ్చితే ఆచీర తీసుకొంటారు. నేను ఎంత సేపైనా ఉంటాను. నా దగ్గర తప్ప వారు ఇంకొకరి దగ్గర కొనరు. నాకు అంతమాత్రం కృతజ్ఞత లేదండీ ?
కాంతం: ఈ గులాబీరంగు ఇల్లా ఉంటుందా? తేలిపోతుందా?
కోటయ్య: మీరు ఇన్నాళ్లూ బట్టా నా దగ్గరకొంటున్నారు. ఎప్పుడైనా ఇచ్చానా రంగు పోయేగుడ్డ మీకు?
కాంతం: నీమాట నాకు నమ్మకమే. అందుకే నేగా అడగటం.

కోటయ్య: రంగువిషయమై మీరేమీ భయపడకండి. అది గ్యారంటీ రంగు.

కాంతం: అయితే ఇయ్యి.

పంతులు: ఏదీ?

కాంతం: (సందేహంతో) ఎరుపుదే ఇయ్యి

పంతులు: ఏదో సందేహంగా అంటున్నావు ఇంకా?

కాంతం: సందేహం ఏముందీ? ఈ ఎరుపే కొనమన్నారుగా? కొంటాను.

పంతులు: (ప్రసన్న వదనముతో ... తనుకొనమన్నచీరే కొంటున్నదనీ అసలు ఏదో ఒకటి తేలిందనీ సంతోషిస్తూ) అమ్మయ్య! తీసుకో.

కాంతం: (చీరతీసుకొని మరొకసారి గుడ్డపట్టుకొనిచూచి చప్పరించి) మబ్బురంగు చీరకు ఉన్న నాజూకుతనం దీనికిలేదు.

పంతులు: (మిక్కిలి విసుగుతో) పోనీ అదేకొనుక్కో. ఇప్పటికి బైటపడ్డాం. చీరమటుకు ఫస్టు అయినచీర. నా మనస్సుకు నచ్చింది కొన్నావు. అందుకని సంతోషంగా ఉంది.

కాంతం: బాగానేఉంది కాని, ఈ తభాకు మబ్బురంగు చీరకొంటే బాగుండేది సుమండీ! సంకురాత్రికి మీరు ఎట్లాగూ ఈచీర కొనేవాళ్ళు

(అంటూ మళ్లీ వాకిట్లోకివెళ్లి కోటయ్య వెళ్ళినదిక్కుకు చూస్తుంది. పంతులు వెళ్ళి ఆవిడ చెయ్యిపట్టుకొని ఇవతలకులాగి "ఢాం"న తలుపేసి ఆవిడను నెట్టుకొంటూ తీసికెడతాడు వంట ఇంట్లోకి "అన్నం పెడుదువుగాని. రా" అంటూ)



# 4

(రంగము: క్లాసురూమ్ - టీచరులేనిసమయము - పిల్లలంతా అల్లరిచేస్తూ ఉంటారు, దగ్గులు, నవ్వులు, మాటలు, పోట్లాటలు, పాటలు. ఒకరు... కోడికూత. శ్యామం మానేటర్)

శ్యామం: సైలెన్సు...వస్తున్నారు.

(అంతానిశ్శబ్దం.)

ఒకరు: ఏరీ? వస్తున్నారంటివి. ఏర్రా?

ఇంకొకరు: రావటంలేదు. ఎవ్వరూ రావటంలేదు.

శ్యామం: అబద్ధం చెప్పావేంరా?

శ్యామం: వస్తున్నారనుకొన్నాను. (మాస్టరులాగ) నీకు ఎన్నిసార్లు చెప్పానురా ఏ విషయంలోగాని నీయిష్టం వచ్చినట్లు అనుకోకూడదనీ? నిజం తెలుసుకోవాలె. తెలిసిందా?

అంతా నవ్వుతారు (ఒక నిమిషమయిన తరువాత)

శ్యామం: ఇష్ ష్ ష్ — అరుగో!!

కొందరు: ఏడీశావ్.

వట్టిదే!

నిజమేనురోయ్! వస్తున్నారు.

(నిశ్శబ్దం. చెప్పులకాళ్ల చప్పుడు - టీచరు ప్రవేశం)

టీచరు: (గొంతు సవరించుకొని కొద్దిగా దగ్గి) అల్లరి చేస్తున్నట్లుగా ఉందే? ఎంరా? అల్లరిచేస్తున్నారా?

పిల్లలు: లేదండీ సార్ !

లేదండీ మాస్టారూ !

మేముకాదండీ, పక్క క్లాసువాళ్లండీ!

వాళ్లెప్పుడూ గోలచేస్తూనే ఉంటారండి !

టీచరు: అంతే అయి ఉంటుంది. పక్క క్లాసువాళ్లే అయి ఉంటారు. పొరపాటున నేను, మీరే అల్లరి చేస్తున్నారని అనుకొన్నాను.

పిల్లలు: అంతేనండి సార్ !

మీరే పొరపడ్డారండి.

మేము ఎప్పుడూ అసలు అల్లరిచేయమండి.

టీచరు: పోనీలే - ఏంచేస్తాము. "ప్రమాదో ధీమతా మపి" అన్నారు. అంటే ఏమిట్రా సుబ్బారాయుడూ? అర్థం తెలుసా?

సుబ్బారాయుడు: (పెద్దగా) తెలియదండి సార్!

టీచరు: (ముక్కు ఉఁహూ అని చప్పరించి) నీకు ఎప్పుడు తెలుస్తుందిరా సుబ్బారాయుడూ?

ఒకరు: సుబ్బరాయుడు కొడుతున్నారండి. మాస్టార్! మాస్టార్! చూడండిసార్! (సుబ్బరాయుడు పక్కవాణ్ని తపీమని కొడుతాడు. శబ్దం.)

టీచర్: ఒరే, సుబ్బరాయుడూ! ఏమిటిరా అదీ? నీ అసమాన బాహు పరాక్రమమంతా ఇక్కడే చూపిస్తావేంరా?

సుబ్బరాయుడు: (మాట్లాడడు. తెల్లపోతాడు)

టీచర్: మాట్లాడవేంరా? నేను చెప్పింది విన్నావా?

సుబ్బరాయుడు: విన్నానండి.

టీచరు: అర్థం అయిందా?

సుబ్బారాయుడు: కాలేదండి.

టీచరు: అర్థంకాలేదూ? ఒక్కముక్కా కూడా?

సుబ్బరాయుడు: ఊహు, లేదండి సార్!

టీచరు: నీ ఖర్మంరా.

సుబ్బారాయుడు: అవునండి.

టీచరు: దాని అర్థం ఏమిటంటే? నీవుచాలా బలంకల వాడివి అని. ఆబలం ఇక్కడ చూపకూడదని.

సుబ్బారాయుడు: అవునండి.

టీచరు: ఏమిటి నీ మొఖం! అవునండి ఏమిటి? (నొక్కి-) ప్రతిదానికీ అవునండి అవునండి అవునండి (వెక్కిరింతగా) ఏమిటి నీముఖం?

సుబ్బారాయుడు: (విచారంగా) అవునండి.

(అంతా నవ్వుతారు)

టీచరు: (కోపంగా) ఎవరది? ఎవరా నవ్వింది? శ్యామా నువ్వేనా? వెధవా దెబ్బలుతింటావు. జాగ్రత్త! (ముక్కి-) ఊఁహు ఊఁహు- ఎందుకురా అనవసరంగా నవ్వటం? సామెతె ఒకటిఉంది తెలుసునా?

ఒకడు: తెలుసునండి. ఉత్తగొడ్డుకు అరుపులెక్కువండీ,

ఇంకొకడు: కాదండి? మొఱిగేకుక్క కరవదు.

టీచరు: ఛా! ఛా! "ఒక్కడికీ, ఒక్కడికీ, రవ్వంత జ్ఞానం లేదు" ఈ సందర్భానికి సరిపొయే సామెతరా?

ఒకడు: నాకు వచ్చునండీ సార్!

టీచరు: ఏమిటి చెప్పూ?

ఒకరు: నవ్వు నాలుగిందాల నష్టం.

టీచరు: (సంతోషంతో) అది! అది! అది! మన తెలుగు భాషలో సామెతలు విజ్ఞానపేటికలు. పూర్వాంధ్రకవి గాత్రమణ్యార్జిత వాఙ్మయపేటికాంత స్థితమాణిక్యములు. అధునాతన ఆంధ్రకవి కిశోరములకు

అరుగ్రిలుసాచి క్రుమ్మరోదగిన కళామణులు. వేయేల?
ఆంధ్రభాషా మోషకమూల్యాభరణములు. తెలి
సిందా?

(ఒకముక్క అయినా అర్థంకాకపోయినా, కుర్రవాళ్ళు అంతా
నవ్వుతారు. కొంతసేపటికి నిశ్శబ్దం)

టీచరు: సరే. అటెండెన్సు ఇవ్వండి. తారీఖు ఎంతరా
ఇవ్వాళా?

పిల్లలు: ఇరవై మూడండీ.
ఇరవై నాలుగండీ.
(పక్కవాడితో)
ఏడ్చావు. ఇవ్వాళ ఇరవై మూడు.
నోరుమూయ్. ఇవ్వాళ ఇరవై నాలుగు.

టీచరు: ఒరేయ్! ఒరేయ్! ఏమిటాగ్రి అల్లాగ పోట్లాడు
కొంటున్నారూ? ఊరుకోండి. మానిటర్! తారీ
కెంత?

మానిటర్ శ్యామం: ఇవ్వాళ ఇరవై నాలుగండి.

టీచరు: సరే. చెప్పండి. శ్వేతాచార్యా! (పలకడు)
ఒరేయ్, శ్వేతాచార్యా!

శ్వేత: అయ్యా!

టీచరు: కూర్చో. పిలిస్తే పలకవేం?
శ్వేత: నన్ను కాదనుకొన్నానండీ.
టీచరు: బాగుంది. నీకు ఎన్నిసార్లు చెప్పానురా అల్లా అనుకోవద్దని? సరే. కూర్చో. శ్యామసుందరం?
శ్యామం: (పెద్దగా) అయ్యా!
టీచరు: ఎందుకురా అంత పెద్దగా అరుస్తావ్రా? నాకింకా చెముడు రాలేదే?
ఒకడు: (ఆశ్చర్యంగా) ఇంకా రాలేదటండిసార్ !
ఇంకొకడు: ఎప్పుడొస్తుందండీ మాస్టారూ?
టీచరు: ఇష్‌ష్ - జమదగ్ని?
జమదగ్ని: అయ్యా!
టీచరు: హ్రస్వదృష్టి?
హ్రస్వ: అయ్యా!
టీచరు: దీర్ఘనాశికా?
పిల్లలు: లేడండి.

బయటికెళ్లాడండి.

పారిపోయినాడండి.

మిమ్మల్లను అడిగే పోయిఉంటాడండి.

టీచరు: చాలు. ఇహ ఊరుకోండి. నీలకంఠం?
నీలకంఠం: అయ్యా!

టీచరు: శ్రీనాథా (పలకడు. పెద్దగా) శ్రీనాథా?
శ్రీనాథుడు: (పెద్దగా) అయ్యా!
టీచరు: మొదటిసారి పిలిచినపుడు పలకలేదేమోయ్?
శ్రీనాథుడు: వినపడలేదండీ సార్!
టీచరు: వినపడలేదూ? ఎందుకు వినపడుతుందీ? (ఒక్క గుక్కలో రాగవరుసగా) డిండిమ భట్టారక పాండిత్యభేరీ విఘట్టన జనితార్భటీ బధిరీకృతాలై పోయినయ్యా నీ శ్రవోరంధ్రాలు?

(ఈమాటలు అని వాడిపైన కసితీర్చుకొన్నట్లు సంతోషపడుతాడు. నిట్టూరుస్తాడు. సంతోషంతో క్లాసుపంక చూస్తాడు. ఒక్కరూ మాట్లాడరు. అంతా బిత్తరపోయి చూస్తుంటారు.)

టీచరు: (నిరుత్సాహంతో) సరే. పెద్దన్నా?
పెద్దన్న: అయ్యా!
టీచరు: చిన్నన్నా?
చిన్నన్న: అయ్యా!
టీచరు: (పుస్తకం గట్టిగామూసి) ఊహూ (దగ్గి) ఇఁహూ పుస్తకాలు తెరవండి. ఎన్నో పుటరా?
పిల్లలు: ముప్పై అండి.
ఇరవై ఎనిమిదిఅండి.
(పక్కవాడితో)

ముప్ఫైవ పేజీ కదరా ?

ఏడ్చావు. నోరుమూయ్. ఇరవై.

కాదండీ సార్! నలభై అండీ.

టీచరు: అబ్బ! అబ్బ! ఎన్నో పేజీ అంటే - ఇన్ని రకాల జబాబులా?

ఒకరు: కొత్త పుస్తకాల్లో ఒకరకం - పాత పుస్తకాల్లో మరోరకంగా ఉన్నయ్యండి పేజీలు!

టీచరు: మానేటర్ - నీవు చెప్పూ?

మానిటర్: ఏమోనండి తెలియదండి.

టీచరు: తెలియదూ ? నీకూ తెలియదూ? క్రిందటిసారి మనం ఎక్కడ వదిలేశాంరా?

మానిటర్: క్రిందటిసారి మనము నరసింహరాయలను కొండవీటిలో వదిలేశామండి.

టీచరు: సరి. హాయగ్రీవా! తీయ్. అక్కడతీసి చదువ్రా? ఊఁ మొదలుపెట్టూ.

హాయగ్రీవుడు: పుస్తకం లేదండి సార్!

టీచరు: (కోపంతో) ఏమైందిరా? ఏమైందిరా నీపుస్తకం? ఎక్కడుంది? మాట్లాడవేం?

హాయగ్రీవుడు: తెలియదండీ.

టీచరు: శ్యామా! నీవు చదువు.

శ్యామ: "నరసింహారాయలు 1402 సంవత్సరమున సింహాసనము నధిష్ఠించెను. అతడు చాల మంచి వాడు కాని అసమర్థుడైన రాజు"

(పెద్దగా రాగవరుసగా పురాణంలాగ గబ గబ చదివేస్తాడు)

టీచరు: ఆగు. హ్రస్వదృష్టి! నరసింహారాయలు ఎప్పుడు రాజ్యమునకు వచ్చెను?

హ్రస్వదృష్టి: ఏమోనండి. తెలియదండి.

దీర్ఘనాశిక: (పెద్దగా అరుస్తూ) పద్ధాలుగు వందల తొంభై రెండండి!

టీచరు: ఒరే! నీవెందుకు అల్లాగ అరుస్తావురా? నిన్ను చెప్పమన్నానా? చెప్పు? నిన్ను చెప్పమనిఅడిగానా?

దీర్ఘనాశిక: లేదండి. నన్ను చెప్పమనలేదండి.

టీచరు: అయితే మరి ఎందుకు చెప్పావ్రా? మాట్లాడవేం ఎందుకు చెప్పావురా?

దీర్ఘనాశిక: ఏమోనండి. తెలియదండి.

టీచరు: అట్లా చెప్పటం తప్పు. అవునా?

దీర్ఘనాశిక: తప్పేనండి. తప్పేనండి.

టీచరు: అయితే బెంచీ ఎక్కు.

దానితరువాత చదువు చిన్నన్నా!

చిన్నన్న: "అతడు చాలమంచివాడు. కాని అసమర్థుడైనరాజు"

టీచరు: ఆగు. ఆతడు ఎందుచేత అసమర్థుడైనరాజు! చెప్పు. చిన్నన్నా!

చిన్నన్న: మంచివాడు కాబట్టి అండి.

టీచరు: ఛా! ... తెలివి తేటలు చిన్నన్నకు సున్న. "చిన్నన్నా కొంచెము యోచించన్నా" అన్నాడురా కవి. ఇప్పుడు చెప్పు సరియైన జబాబు.

చిన్నన్న: తెలియదండి.

పిల్లలు: తెలివ తక్కువవాడండీ.

పరిపాలించలేకపోయినాడండి.

చిన్నన్నండి.

టీచరు: చాలు. ఆగండి. ఆతడు అసమర్థుడెందుకైనాడంటే, ఆతనికి పరిపాలనా దక్షతలేదు. తెలిసిందా? అదీ సంగతి. చదువు పెద్దన్నా, ఆపైన చదువూ!.

పెద్దన్న: "సామంతులైన దుండగీడులను ఆతడు దండించక, కటాక్షించి, ఉపేక్షించుటచే వారు గర్విష్ఠులై దుష్టులజేరదీసి శిష్టులను చెండాడిరి"

టీచరు: ఉపేక్షించి అంటే ఏమిటి పెద్దన్నా?

పెద్దన్న: తెలియదండీ. ఏమోనండీ. (చప్పున జ్ఞాపకం వచ్చినట్లు నటించి) ఆఁ ఆఁ తినటం అండీ.

టీచరు: తినటమా? తినటం ఏమిటిరా? పెద్దన్నా! మొద్దన్నా! ఏమిటిరా తినటం కపిద్ధమా?

పిల్లలు: ఛీ ఛీ

తూ హా

ఎబ్బే

(ఇల్లాగే అందరూ అసహ్యించుకొంటారు)

టీచరు: కపిద్ధము అంటే ఏమిట్రా పెద్దన్నా?

పెద్దన్న: (అసహ్యించుకొని నవ్వుతూ) అసహ్యమైనదండీ.

టీచరు: ఓరి వెధవా! ఈమాత్రం తెలియదురా? నీకు భాషాజ్ఞానం పూజ్యంరా. పూజ్యం అంటే తెలిసిందా?

పెద్దన్న: తెలియలేదండి.

టీచరు: తెలియలేదూ? ఛా నీవు శుద్ధ తెలివితక్కువ, అవివేకపు, అప్రాచ్యపు, అపభ్రంశపు, అనాథపు, పెద్దన్న వన్న మాట.

పెద్దన్న: అవునండి సార్!

టీచరు: ఏమిటి అవునురా?

పెద్దన్న: నేను వట్టి తెలివితక్కువవాడినేనండి. మా అమ్మకూడా అట్లాగే అంటుందండి.

టీచరు: ఇంహా నీవుకూర్చో. జమదగ్ని! నీవు చదువు అక్కడనుంచి.

జమదగ్ని: ఆతడు చాలమంచిరాజు, కాని అసమర్థుడైన రాజు.

పిల్లలు: అక్కడకాదండీ.

మళ్లీ మొదటికొచ్చాడండీ.

ఇంకా ముందండి.

జమదగ్ని: "తిట్టి కొట్టి"

పిల్లలు: మరీ ముందుకెళ్ళాడండి.

వెనక్కు రావాలండీ.

టీచరు: ఒరేయ్ మహిషపుంగవుల్లారా ఏమిట్రా అదీ? చదవరా. "శిష్టుల చెండాడిరి" అక్కడనుంచి.

జమదగ్ని: "వారు ధనాశాపరులై, శ్రీమంతులను పట్టి కొండంబుతీయించి, పట్టి కొట్టి పలు విధంబుల బాధలు పెట్టసాగిరి"

హ్రస్వదృష్టి: మాస్టార్! మాస్టార్!

టీచరు: (విసుగుతో) ఏమిట్రా

హ్రస్వదృష్టి; నాపుస్తకం తెచ్చుకొంటానండి.

టీచరు: ఎక్కడఉందీ ?

హ్రస్వదృష్టి: పక్క గదిలోఉందండి.

టీచరు: అయితే ఇందాకటినుండీ పుస్తకం లేకుండానే ఉన్నావ్ ?

హ్రస్వదృష్టి: ఉన్నానండి.

టీచరు: సరే. పో. తొందరగా తెచ్చుకో.

శ్యామం: సార్! మాస్టర్!

టీచరు: ఏమిటి? నువ్వేమిటి అడుగుతున్నావ్?

శ్యామం: నా పుస్తకంకూడా తెమ్మనండిసార్. అక్కడే ఉంది.

టీచరు: సరే. పోరా. వీడిపుస్తకం కూడా తీసుకురా. ఇంహ చదువు చిన్నన్నా! చదవరా.

చిన్నన్న: ఎక్కడనుంచి అండీ ?

టీచరు: ఓరి వెధవా ! ఎక్కడనుంచి చదవాలో తెలియదా? ఛా! మందమతీ. వాడు వదిలేసిన దగ్గర నుంచీ చదువు.

చిన్నన్న: " నరసింహరాయలు చాల మంచివాడు కాని అసమర్ధుడైనరాజు "

పిల్లలు: వెనక్కివెళ్లాడండి సార్ !
లేదండి సరిగ్గానే ఉన్నాడు.

ఇంకా ముందు ఎత్తుకోవాలెరా.
ఏడ్సావు. వెనకనే ఎత్తుకోవాలె.

టీచరు: ఒకేయ్ ఏమిట్రా అది? గొడవచేస్తున్నారూ?

పిల్లలు: లేదండీ సార్ !
లేదండీ మాస్టరుగారూ!

టీచరు: శ్వేతాచార్యా! నీవుచదువ్రా ఆపైనా.

శ్వేత: "పలువిధంబుల బాధలు పెట్టసాగిరి" అంతవరకు అయిందండీ.

టీచరు: అక్కడనుంచి చదువు.

శ్వేత: "అతడెప్పుడునూ వేణు వనంబున నివసించి యుండె"

టీచరు: ఆగు "వేణు" అంటే తెలుసా? "వేణు" అంటే ఏమిటి శ్వేతాచార్యా!

శ్వేత: తెలియదండీ.

పిల్లలు: ఆడపిల్ల పేరండీ.
చాఛా మొగపిల్లవాడి పేరు.
కాదులే. నీకు తెలియదు ఊరుకో.
ఆడపిల్లపేరుకాదండీ మాస్టరూ?
(నవ్వి) ఛా మా అన్నయ్యపేరు వేణు.

టీచరు: ఒరేయ్ మళ్ళీ మొదలుపెట్టారూ?
ఊ...ఇంహ నోరుమూసుకొంటారా ?
పిల్లలు: మూసుకొంటామండీ.
పంతులు: చదువు. శ్వేతాచార్యా!

(ఇంతలో హ్రస్వదృష్టి ప్రవేశము)

హ్రస్వదృష్టీ! పుస్తకం తెచ్చుకొన్నావా?
హ్రస్వదృష్టి: సార్! సార్! పుస్తకం కనుపించలేదండీ.
టీచరు: (విసుగ్గా) సరే. కూర్చో. పో
హ్రస్వదృష్టి:
(ఏడుపుముఖం పెట్టి నుంచునిఉంటాడు. కూర్చోమంటేకూర్చోడు.)
టీచరు: కూర్చోరా. ఎందుకు ఏడ్పుముఖం పెడతావ్.
నన్నేం జేయమంటావు?

శ్యామం: పుస్తకం పారేసుకొన్నాడండి.
ఒకడు: వాళ్ళనాన్న తంతాడండి.
టీచరు: సరే. కూర్చో.
హ్రస్వదృష్టి: పుస్తకంలేకుండా ఎట్లాగండి?
టీచరు: ఎల్లాగో జరుపుకోరా.
హ్రస్వదృష్టి: సరేనండి.
శ్యామం: సార్!

టీచరు: ఆపైన చదువ్వా.
శ్యామం: సార్! అదికాదండి. వాడు నా పుస్తకం తెమ్మంటే తేలేదండి.
టీచరు: మరి ఏమంటావ్?
శ్యామం: నేనుకూడా పుస్తకంలేకుండా జరుపుకోనా అండి?
టీచరు: ఏం వెధవప్రశ్న అడిగావురా? జరుపుకో...... ఇహ ఊరుకోండి పాఠం కానిద్దాం. శ్వేతాచార్యా! రాయలు ఎప్పుడూ ఎక్కడ ఉండేవాడూ?
శ్వేతాచార్య: వేణువనంలోనండి.
టీచరు: చదువ్వా, ఆపైన చదువ్వా.
శ్వేతాచార్య: వేణుఅంటే ఏమియు చెప్పలేదండి. ఆడపిల్లపేరంటే కాదన్నారండి.
టీచరు: ఒహో. ఇప్పుడు చెప్పు. వేణు అంటేఏమిటో?
శ్వేత: నాకు తెలియదండీ.
టీచరు: నీవోయీ శ్రీనాథా!
శ్రీనాథుడు: తెలియదండీ.
టీచరు: (సంగీతంతో) "చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడె రచియించితిని మరుత్తరాట్చరిత్ర" అన్న శ్రీనాథుడికే తెలియదా?

(అంతా నవ్వుతారు)

సరే. ఎవ్వరన్నా చెప్పగలరా వేణు అంటేఏమిటో?

పిల్లలు: నేచెపుతానండి. వేణు అంటే కర్రండి.
వట్టి కర్రకాదు, వెదురుకర్రండి.
బొంగండి సార్! బొంగు!

(పిల్లలంతా 'బొంగు బొంగు' అని అరుస్తారు. ఇంతలో ఖంగ్ ఖంగ్ న గంట మ్రోగుతుంది. పిల్లలు పుస్తకాలను దఢీమని మూసేసి వేస్తారు. లేచినపుడు సీట్లు శబ్దం చేస్తవి)

టీచరు: ఒరేయ్ ఏమిటది. కూర్చోండి. (పెద్దగా)
కూర్చోండి. పుస్తకాలు మూశేసారెందుకూ?
మిమ్మల్ని పుస్తకాలు మూసివెయ్యమన్నానా?

పిల్లలు: లేదండి. పుస్తకాలు మూయమనలేదండి.

టీచరు: మరి ఎందుకు మూశారూ?

పిల్లలు: వీడుమూస్తే. నేనూ మూశానుసార్ !
కాదండి సార్! వాడే ముందు ఢపీమని పుస్తకం ఇల్లా కొట్టాడండి (కొట్టి చూపిస్తాడు)
నేనా ? అంతా వట్టిదే నండి. అబద్ధాలాడుతున్నాడండి.

టీచరు: ఇంహా ఆగండి. వెధవలు! వెధవలని! "పుస్తకాలు మూయండి" అని నేను అనందే మీరు

మూయకూడదు. తెలిసిందా? తెరవండి మళ్లీ పుస్తకాలు. చదువు ఓ జమదగ్నీ;

జమదగ్ని: (పెద్దగా) "నరసింహారాయలు చాల మంచి వాడు కాని అసమర్థుడైనరాజు"

టీచరు: అవు. వచ్చేపర్యాయం అక్కడనుంచి చదువుదాం. పుస్తకాలు మూయండి. చప్పుడు కాకూడదు.

(పిల్లలు చప్పుడుచేస్తూ పుస్తకాలు మూస్తారు)

టీచరు: సిట్.

పిల్లలు: ఇప్పుడు సిట్ లో ఉన్నామండి.

టీచరు: అయితే స్టాండ్—సిట్—స్టాండ్-మార్చ్-

(క్లాసు వెళ్ళిపోతుంది. టీచరు పుస్తకాలు చంకను పెట్టుకొని తన డ్యూటీ తాను సక్రమంగా నిర్వహించినపుడు కలిగే తృప్తితో ఠీవిగా చిరునవ్వుతో నడిచిపోతాడు)

(ఆల్ ఇండియా రేడియో వారి అనుమతిని.)



య థా ర్థ దృ శ్యా లు

# 5

(పంతులు ఇల్లు. సుసీ తొమ్మిదేండ్లపిల్ల. పాప అయిదేండ్ల బిడ్డ. పున్నాయి పాలుపోసే మనిషి. బడిలో పాఠాలు చెప్పి చెప్పి విసుగ్గా వస్తాడు పంతులు ఇంటికి.)

పంతులు: (ప్రవేశించి) అబ్బ, ఇల్లంతా ఇల్లాగ ఉందేం? కాగితాలూ, గుడ్డపేలికలతో, లాటాకు బొమ్మలూ, పుస్తకాలూ...బుగ్గి! ఏమిటిది అంతా ?
(గడప దాటుతుంటే కంచెంబు కాలికి తగులుతుంది)
ఈ చెంబులు దారిలో వదిలేయకపోతే, ఒకమూల ఎక్కడైనా పెట్టకూడదూ? అసలు వంటింట్లో ఉండాల్సిన దరిద్రం అంతా ముందు సావట్లో ఉంటుందేం ఖర్మం? ఎంతమేర కొట్టుకు పోయిందో చూడూ! ఎం అవస్థ ఇది ?

సుసీ: అది కాదు నాన్నా! పాప మంచినీళ్లు తాగి చెంబు అక్కడ పెట్టింది.

పంతులు: నా మొఖం నా మోరాను! అది అక్కడ పెడితే నీవు తీయలేక పోయినావా? మీ అమ్మ తీయలేకపోయిందా? కొంప, కొంపగా ఉంచరుగదా! (కోటుతీస్తూ) ఈ కోటొకటి నా బ్రతుక్కుతోడు! నా ఉద్యోగానికితోడు కోటుకూడానూ!

(కోటు తీసి వంకెను తగిలిస్తే వంకెలు ఊడి క్రిందపడతై)

ఇదేమిటి ! ఈ వంకెలు ఊడగొట్టేం దెవరు? హుం.
ఏం దరిద్రం వచ్చిందే?........ ఏమిటిది! ఎక్క
డున్నావ్! ఏమేవ్ ... నిన్నే ... పలకదు ఎంత
అరచినా పలకదు. ఏ అంతఃపురములో ఉందో !
(పెద్దగా) ఎక్కడున్నావ్ ? ఎక్క ... డున్నావ్రా
అంటా ? ఇంకా వినపడటం లేదూ. ఓయ్.

కాంత: ఆఁ ఆఁ ఎందుకు అల్లాగ కేక లెడుతారూ?
వస్తున్నా. చెయ్యి ఊరుకోలేదు.

పంతులు: చెయ్యి ఊరుకోలేదూ? ఊరుకోక ఏం జేస్తు
న్నది? పోనీ చెయ్యి ఊరుకోకపోతే నోరు ఏం
జేస్తున్నది? ఆఁ అనరాదూ?

కాంతం: ఆఁ ఆఁ వస్తున్నానండీ.

పంతులు: నీవు వచ్చేటప్పటికి కలియుగంలో ప్రథమ
పాదం దాటుతుంది ! సాయంత్రం మొగుడు అనే
వాడు ఒకడు ఇంటికివస్తాడు, వాడిమాట కాస్త
చూడాలె అని ఇంతవరకు నీకు తెలియకపోయె !
కాళ్ళీడ్చుకొంటూ అక్కడనుంచి ఇక్కడికొస్తాను
కొంప ఏదో స్వర్గం అనుకొంటూ. తీరా వస్తే
అధ్వాన్నంగా వుంది. ఉఁహూ (పై తువాలుతో

బల్లపై నున్న దుమ్ము దులుపుతాడు. ఆ తువాలే గోడలపైకికూడా విసురుతూ) ఇల్లంతా ఛీ ఛీ ఛీ ఇల్లంతా దుమ్ము...దూళీ! (మొఖం వికారంగా పెట్టి, కళ్లు చిట్లించి, అసహ్యించుకొంటూ, మధ్య మధ్య ఛూ ఛూ అంటూ తిరుగుతాడు వళ్లంతా చీమలు కుడుతున్నట్లు.) ఎందుకొచ్చిందీ అంట ఈ దుమ్మంతా ?

కాంతం: మీరా రొచ్చి ఈ గదిలో కూర్చోండీ మహా రాజులాగ. ఎందు కల్లాగ విసుక్కుంటారు ? ఇంటికి వచ్చారన్న సంతోషం లేకుండా ధుమ ధుమ లాడు తా రెందుకు?

పంతులు: (దేనికోసమో బల్లపైన వెతుక్కుంటూ, విసుగుతో) విసుక్కోక చచ్చేదీ ? అబ్బబ్బ ! ఆ సిగ రెట్లు పెట్టెక్కడా కనపడదేం ? ......ఎక్కడ పెట్టిన వస్తువ అక్కడ ఉండదు ! (బల్లమీద పుస్తకాలు ఒక్కొక్కటే తీసి క్రిందికి విసరికొడుతూ) ఉహూ, ఇక్కడలేదు. ఏమై పోయిందో? ఎక్కడ తగలడ్డదీ అంటా ?

కాంతం: నాకేం తెలుస్తుందండీ!

పంతులు: నీకేమీ తెలియదు! మరి ఏమై పోయిందీ? పొద్దున్నే కదా తెప్పించింది? సుసీ, నీవేమైనా చూశావుటే?

సుసీ: నే నెరగను నాన్నా. అమ్మనడుగు.

పంతులు: ఏమే?

కాంతం: ఇది మరీ బాగుందండోయ్! మీ సిగరెట్ల సంగతి నాకేం తెలుస్తుంది చెప్పండీ?............... (పంతులు వంటింట్లో అలమరలో నుంచి డబ్బాలు క్రిందకు పడతోస్తుంటాడు)...అదేమిటండీ? మీ సిగరెట్లు...నేను తీసికెళ్లి అక్కడ దాచుకొన్నానా?

పంతులు: (విసుగ్గా) అక్కడ సిగరెట్లు ఉంటాయని కాదు. ఆ డబ్బాలలో చిల్లర డబ్బులు ఏమైనా దొరుకుతాయేమో, ఇంకో ప్యాకెట్ అయినా తెప్పించుకొందామని. ఇక్కడ ఓ దమ్మిడీ అయినా లేదే! అమ్మగారు ఎక్కడో దాచేసింది! పొద్దున తెప్పించిన ప్యాకెట్ ఏమైపోయినట్లూ! (మళ్ళీ పుస్తకాల వెనకాల వెదికి) ఎక్కడుందే? వెదకలేక చస్తున్నాను. ఒక్కరూ మాట్లాడరేం? ప్రొద్దుటినుంచీ ఒక్క సిగరెట్టుముక్క అయినా తాగలేదు. ఎల్లాగో

ఉంది! అబ్బ! అందరూ చూస్తూ ఉంటారు తమాషా!

(నిస్పృహతో తల గోక్కుంటూ నిలబడతాడు)

పాపా నీవేమన్నా చూశావా?

పాప: ఏమిటి నాన్నా?

పంతులు: సిగరెట్ ప్యాకెట్లు.

పాప: అంతే?

పంతులు: అంతేనా? సిగరెట్లు! అమ్మా, తాగే సిగరెట్లు, పొగవస్తుందీ...(సిగరెట్ త్రాగడం అభినయించి) అది.

పాప: అదా...నాన్నా...నే ఇత్తా.

పంతులు: నా కన్నతల్లే.....తిసుకురా అమ్మా (కాంతంతో) చూశావా, అదితీసింది. పిల్లలు తీసిపారేస్తుంటే చూస్తూ ఊరుకొన్నావన్నమాటేగా?

కాంతం: అయ్యో, ఇదెక్కడిపాపమండీ! నేనేం ఎరగనండీ.

పంతులు: వినటంలేదూ దానిమాటలూ? అది తీశానని చెబుతూంటూనే! (పాపతో) సిగరెట్ ఏదమ్మా ఇల్లాగ తీసుకొనిరా...

(పాప తాగి పారేసిన పీకలు నాలుగు తెచ్చి ఇస్తుంది.)

ఛా ఛా ఇవేమిటే! ఇవి పీకలే! చిలక్కొట్లు! తాగి పారేసినవి. ఇవన్నీ ఎక్కడ జాగ్రత్త పెట్టావే! ఛా అవతలపారేయ్ (అని విసిరి వసారాలో పారేస్తాడు.)

పాప: పాకెట్టా? పాకెట్టు ఏమిటి నాన్నా?

పంతులు: ప్యాకెట్ అంటే...పెట్టె.

పాప: అట్టపెట్టా నాన్నా?

పంతులు: (ఆదుర్దాగా) ఆఁ ఆఁ ఆఁ అదేనే, అదే ఎక్కడుంది?

పాప: అదా నాన్నా! తెస్తానుండు.

పంతులు: చప్పున తీసుకురా అమ్మా. పెట్టెలో పెట్టావుటే! నాతల్లిగదే! (పాప పెట్టె తెచ్చియిస్తుంది) ఇదేమిటే నాతల్లీ? వట్టిపెట్టె ఇది!

పాప: ఇటువంటివి...నాదగ్గర...ఇంకా ఇన్ని ఉన్నై నాన్నా...

పంతులు: నా నెత్తి, ఎందుకే ఇదీ? (ఎక్కడైనా ఒక సిగరెట్ ఉందేమోనని పెట్టెఅంతా వెతికి) ఇదికాదే అమ్మా! సిగిరెట్లు ఉన్న పెట్టె! ఇంతింత వుంటై తెల్లగా పొడుగ్గా! (పెనసలు నోట్లో పెట్టుకొని సిగరెట్ తాగుట చూపుచూ) ఇట్లా తాగుతారే. అవి ఉన్న పెట్టె.

పాప: అవి నేనెరగను నాన్నా!

పంతులు: చంపావు డబ్బేమన్నా ఉందమ్మా కాంతం?

కాంత: నాదగ్గర డబ్బు ఎక్కడిదండీ?

పంతులు: డబ్బు ఎక్కడిదా? పొద్దున యిచ్చిన రూపాయీ ఏంజేశావూ?

కాంతం: ఏదో ఖర్చు అయిపోయిందండీ.

పంతులు: రూపాయి ఖర్చు అయిపోయిందీ! (ముఖం రెండు అరచేతుల్తో కప్పుకొని ఒక్కనిమిషం అయిన తరువాత) ఇంకేంచేసేది? కాంతం, ఏమేవ్ !

కాంతం: ఆఁ ఆఁ ఎందుకండీ?

పంతులు: నాపని అయిపోయిందీ అంటా. తెలిసిందా?

కాంతం: ఉఁ హూ. (శాంతంగా)

పంతులు: ఏమిటి నాబొంద ఉఁహూ?

కాంతం: మరి ఏంజెయ్యమంటారూ?

పంతులు: ఏంజెయ్యమంటానా?......ఆ తాగి పారేసిన సిగిరెట్టుముక్కలే రెండు ఇల్లాగ తే. నిప్పెట్టె కూడా ఒకటి ఇల్లాగ పడెయ్.

కాంతం: నిప్పెట్టెలు ఎక్కడివి? నిప్పెట్టెలు అయిపోయి వారంరోజులైంది.

పంతులు: అదీ దరిద్రమే!...సరే...నాబతుక్కి అన్నీ తగినట్లే ఉన్నాయ్......ఇంకేం కాస్త నిప్పు పట్టుకురా. నిప్పేంఖర్మం పొయిలో ఆకాలే కొరివి పట్రా.

(కాంతం కొరివి తెచ్చి ఇస్తే సిగరెట్టు కాల్చుకొంటూ)

ఊ... బాగుంది సరే...ఇక నీవు వెళ్లు..... అమ్మయ్య.

(ముక్కు మూతి విరిచి వెడుతుంది కాంతం.)

పాప: నాన్నా, నాన్నా !

పంతులు: ఎందుకే తల్లీ !

పాప: నువ్వూ, నువ్వు, నువ్వ మరీ.....

పంతులు: ఏమిటమ్మా, దబ్బున చెప్పూ, నేను ఏం జేశాను, సిగరెట్టు పీకలు తాగుతున్నాను.

పాప: అదికాదు నాన్నా...

పంతులు: ఏమిటమ్మా?

పాప: మరీ నీవూ...రెండున్నూ, రెండున్నూ కలిపితే నాలుగు అవుతుంది అనలేదూ?

పంతులు: ఆ అన్నాను. అవుతుంది. ఇప్పుడేం?

పాప: అయితే మరీ...అమ్మా...మూడున్నూ ఒకటి నాలుగని చెప్పిందేం?

పంతులు: అవునే. మూడున్నూ ఒకటి నాలుగే.

పాప: మరి రెండూ, రెండో?

పంతులు: రెండూ, రెండూనూ నాలుగే !

పాప: అదేమిటి నాన్నోయ్? (విరగబడి నవ్వుతూంది)

పంతులు: రెండున్నా రెండూ నాలుగే, మూడున్నా ఒకటి నాలుగేనమ్మా !

(పాప మరీ నవ్వుతుంది)

కాంతం: పాపా నీవిట్లారా, నాన్నను విసుగ్గాఉంది. మాట్లాడించక.

పాప: అందుకనే అన్నీ తప్పులు చెబుతున్నాడే అమ్మా!

పంతులు: తప్పుకాదే... రెండూనూ రెండు నాలుగు. మూడున్నా ఒకటి నాలుగు.

(అని కేకవేస్తాడు. పాప మరీ విరగబడి నవ్వుతుంది. పంతులు తెల్లబోతాడు)

పాప: ఇదేమిటి నాన్నోయ్? (విరగబడి నవ్వుతూ వెళ్ళిపోతుంది)

పాలపున్నమ్మ: బాబూ !

పంతులు: అబ్బ, ఎవరది?

పాలపున్నమ్మ: నేను పాలుపోసేదాన్నండి. ఈ ఇంట్లో ఉండిపొయినోరికి నేనే పోశానండి మారాజు ఆయన ఏ వారానికి ఆవారం డబ్బు ఇప్పించేవాడండి.

పంతులు: ఏదో ఏడ్చాడులే. ఇప్పుడెందుకు నాదగ్గర ఆ గోల అంతా. అయితే ఏమిటి నీవు అనటం? చెప్పుతొందరగా.

పున్నమ్మ: ఏంలేదండి తమరికికూడా పాలుపోస్తానండి.

పంతులు: పొయ్యి. ఎవరొద్దన్నారూ?

పున్నమ్మ: అదేనండి తమకు శేరుకావాలో అర్ధశేరు కావాలో సెపితే.....

పంతులు: అదంతా అమ్మగార్ని అడుగుపో.

పున్నమ్మ: సరేనండి........అయితే బాబూ లెఖ్ఖ వారాని కోసారి ఇస్తారా నెలఆఖరుకు ఇస్తారండీ?

పంతులు: నాతలకాయ. నన్ను ఊరికే ప్రశ్నలడిగి విసిగించకు. ఆ సంగతంతా అమ్మగారిని అడుగు పో.

పున్నమ్మ: సరేనండి. అయితే బాబయ్యా, తమకు పిల్లలెంతమందండీ?

పంతులు: (పళ్లుబిగబట్టి కోపంగా) అబ్బబ్బబ్బ!! అమ్మగారిని అడగమని చెపటంలేదూ, అమ్మగారిని అడుగు పో............

(పున్నమ్మ వెళ్లిపోయిన తరువాత తలుపు వేసుకొని పడకకుర్చీలో జేర్లపడి, తాగి పారేసిన సిగిరెట్టుపీకలు ఒకటి తరువాత ఒకటి ముట్టించి తృప్తితో తాగుతుంటాడు.)

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్ — మచిలీపట్నం.

పార్థివ నామ సంవత్సరము ఆనందదాయకమై
మీకు సర్వశుభముల నొసగుగాక.

## 1944 సం॥ అభివృద్ధి సూచిక.

సమకూర్చబడిన వ్యాపారం ...... ఒక కోటికిపైగా
పట్టాలు జారీచేయబడిన మొత్తం ... 85 లక్షలు
అమలులోనున్న వ్యాపారము ...... 3 కోట్లకు పైగా
రెన్యూయల్ ఖర్చు ...... 100 కి 7·5 మాత్రమే.

ఇంత తక్కువరేటు ఖర్చులతో వ్యాపార దక్షతను చూపగలిగి, ఆంధ్రదేశమునందేగాక, అఖిలభారత వర్ష మంతటిలో కూడ పొదుపరితనమునందునూ, ప్రత్యేక శక్తి సామర్థ్యములందునూ, అగ్రగణ్యత గాంచిన యీ భీమాసంస్థయొక్క అభివృద్ధినిగూర్చి గర్వింపదగియున్నది. మంచిపలుకుబడిగల ఏజంట్లకు చాల సౌకర్యములుగలవు. పట్టాదారులసొమ్మునకు అత్యంత భద్రతకలదు.

# ఆంధ్రాబ్యాంకు లిమిటెడ్.

స్థాపితము 1923.

హెడ్డాఫీసు:—మచిలీపట్టణము.

---

—: బ్రాంచి ఆఫీసులు :—

విజయనగరము, కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, బెజవాడ, గుంటూరు, నెల్లూరు, తెనాలి, సామర్లకోట, గవర్నరుపేట (బెజవాడ) బ్రాడీపేట, (గుంటూరు) ఒంగోలు, నర్సారావుపేట, చీరాల, దుగ్గిరాల, అనకాపల్లి, గుడివాడ

మదరాసుబ్రాంచి 378, ఎస్ప్లనేడు,

| | | |
|---|---|---|
| అధికారము పొందబడిన మూలధనము | రు. | 25,00,000 |
| జారీచేయబడిన మూలధనము | | 18,82,500 |
| వసూలుకాబడిన మూలధనము | | 9,86,150 |
| అమలులోనున్న వ్యాపారము మొత్తము | | 1,50,00,000 |

అన్నివిధములైన బ్యాంకింగు వ్యాపారములు చేయబడును. వివరములు ఏ ఆఫీసునకైనను వ్రాసి తెలుసుకొనవచ్చును.

వారణాసి కృష్ణమూర్తి,

ఎం. ఏ., బికాం., యల్. యల్. బి., సి. ఏ., ఐఐ. బి

జనరల్ మేనేజరు

---

## పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

## (గర్భాశయరోగనివారిణి.)

ఆయుర్వేదాశ్రమము,

మదరాసు.



● నవయౌవన ఉజ్వలజీవనానికి

విశ్వసనీయమార్గము ●

## పండిత డి. గోపాలాచార్యులవారి

# * * * జీవామృతము * * *

దేహానికి కాంతి, ఉష్ణరక్తము, బలమైన నరములు,

జీవితోత్సాహమియ్యగల భారతీయ ప్రముఖ రసాయనము.

ఆయుర్వేదాశ్రమము, మదరాసు.

# FAMOUS FILMS CIRCUIT

MOTION PICTURE DISTRIBUTORS

## H. O. NELLORE

***Branches:-***
BEZWADA.
GUNTAKAL.

Tel: "FAMOUS"
Office: BRUNDAVAN.

**Book Now.**

*Our latest spectacular*

*masterpieces in Hindi.*

1. MAHARATHI KARNA



2. PHOOL or FLOWER.



3. TARAMATHI.



4 LAILAMAJUNU.



5. VILLAGE GIRL.



6. BHAIJAN.

TELUGU:--

Balaji or Venkateswara Mahathyam.
Dharmapathni.
Krishna Prema.
Bhagya Lakshmi
Harischandra.
Sarangadhara.
Chandrahasa.
Bhale Pelli & TaruMaru.
Chitranaliam.
Tulasi.
Kalachakram.

HINDI:--

Age kadam.
Dil-ki-Baat.

